శ్రీరస్తు.

నూజివీటి

# శ్రీవేంకటేశ్వర శతకము.

బ్ర॥ మునగంటి వేంకటరత్నంగారి

ప్రియశిష్యుడగు

ఆయంచ వీరబ్రహ్మాచార్యులచే

రచియింపబడి

శ్రీమాన్ బొమ్మకంటి వీరరాఘవాచార్యులుగారిచే

బరిష్కరింపఁబడి

మ॥ రా॥ శిరికొండ మంగయ్యగారి

ద్రవ్యసహాయమున

నూజివీడు శ్రీగౌరీముద్రాక్షరశాలయందు ముద్రింపించి

గ్రంథకర్తచే ప్రకటింపఁబడియె

1941

శ్రీ వేంకటేశ్వరస్వామినేనమః

## దాతృతా స్మృతి

మహారాజరాజశ్రీ, శ్రీరాజా శోభనాద్ర్యప్పారాయ బహద్దరు జమీన్‌దారు (ఎలమర్రుయెస్టేటు) ధొరవారి స్వాధీనమందుండి, నిరంతరము మహోత్సవాది మహావైభవంబు లనుభవించుచు, శ్రీ వారలను, సమస్తభక్తులను సకలభాగ్యంబు లొసంగి రక్షించుచున్న శ్రీ నూజివీటి వేంకటేశ్వర స్వామివారికిఁ గృతిసమర్పణముఁగావింపఁబడిన యీగ్రంథరచన ప్రోత్సాహకర్తలై ముద్రణద్రవ్య మొసంగిన మహోదాతులనుగురించి ప్రశంసాపూర్వకముగా రచింపఁబడిన

సీ॥ మా॥ శ్రీలఁబెంపొందునూ ♦ జ్వీట్పురవాసులై
వేలుపుకొండతె ♦ ల్గాలనంగఁ
బరగుసద్గుణులలో ♦ శిరికొండ వంశాబ్ధి
చంద్రుఁడై సత్కీర్తి ♦ సాంద్రుఁడనఁగ
వెలసి మంగళగిరి ♦ వేంకటనరసమ్మ
యనుసాధ్వివలన బి ♦ చ్చయనుగాంచె
నతఁడు లక్ష్మీనర ♦ సమయను సుమతిచే
మానితోదారుని ♦ మంగయాఖ్య
రామాంజనేయుని ♦ రహిఁగాంచె నందన
జ్యేష్ఠుంతు సన్నుత ♦ శీలుఁడగుచు
సమ్మదంబొప్పఁబం ♦ దొమ్మిదివందల
యిరువదియేడవ ♦ త్సరమునందు

దా జనవరిఘస్టు ♦ తారీకునను వేంక
టాచలపతి పేర ♦ సంఘముగను
విద్యాలయమునుస్థా ♦ పించి నూజివీటిలో
నిర్విఘ్నముగ దాని ♦ నేటివఱకుఁ
దనతమ్మునిదుర్గ దాను ♦ గొనసాగఁ జేయుచు
నొజ్జలై యొప్పిరి ♦ సజ్జనములు
గనిసంతసంబందఁ ♦ గా వేంకటేశ్వరు
పాదాబ్జములను హృ ♦ త్పద్మమందు
నిలిపి నాతోనిట్లు ♦ బలికె దానొకనాడు
శతకంబు వేంకటే ♦ శ్వరునిపైని
రచియింపు మనుర, పీ ♦ రబ్రహ్మకవియన
నంతకుమున్నె నా ♦ యాత్మలోన
గూడరచింపఁగాఁ ♦ గోర్కెగలిగియున్న
కారణమున భక్తి ♦ మీఱ నపుడె
వ్రాయఁబ్రారంభించి ♦ బరిపూర్తిఁ జేసి వి
న్పించిన నచ్చినా ♦ ర్తించె మంగ
తే॥ యాహ్వాయుండీ శతకమును ♦ హర్షమొప్ప
గావునను నిట్టి భక్తాగ్ర ♦ గణ్యులకుఁజి
రాయురారోగ్య పుత్ర పౌ ♦ త్రాభివృద్ధి
నిడుచు శ్రీవేంకటేశ్వరు ♦ డేలుఁగాత॥

ఇట్లు,

భక్తజనపాద రేణువు

అయంచ వీరబ్రహ్మాచార్యులు, నూజివీడు.

నూజివీటి

# శ్రీ వేంకటేశ్వర శతకము

ఆ॥ శ్రీనివాస! శుభద ♦ శీల! పరంధామ!
దీనపోష! ప్రోవు ♦ దేవదేవ!
నిన్నునమ్మికొల్తు ♦ నిఖిలేశ! భవనాశ!
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 1

ఆ॥ శ్రీకరా! కృపాబ్ధి! ♦ లోకేశ! నీపేర
నాటవెలది శతక ♦ మందముగను
నాచరించికృతిస ♦ మర్పింతుఁగైకొమ్ము
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 2

ఆ॥ వారణాస్యునకును ♦ వందనమొనరింతు
నేనుజేయుటకును ♦ బూనుకొనిన
పనికినడ్డురాక ♦ పరిపూర్తిఁజేయింప
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 3

ఆ॥ నలువచెలినినాదు ♦ నాలుక తుదనిల్చి
తాండవంబొనర్చు ♦ చుండుమనుచుఁ
బ్రార్థనంబుఁజేతు ♦ భక్తియుతుండనై
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 4

ఆ॥ పరమభక్తినాదు ♦ గురువరు మునగంటి
కులశశాంకుఁడనఁగ ♦ వెలయుఘనుని
వేడుకొందునెప్డు ♦ వేంకటరత్నమున్
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 5

ఆ॥ వినుతిఁ జేతునాదు ♦ జననీ జనకుల. నా
యంచకులుల వేంక ♦ మాంబ శేష
యాభిధానులనుహృ ♦ దాంబుజమున నిల్పి
వేంకటేశ నూజి ♦ వీట్పురీశ! 6

ఆ॥ అనఘ! మత్స్యమూర్తి ♦ వై సంద్రమునఁ జొచ్చి
సోమకుని వధించి ♦ నీమమొప్ప
వేదములను దెచ్చి ♦ వేధ కొసంగవే
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 7

ఆ॥ కూర్మరూపుఁ దాల్చి ♦ కుధరము బైకెత్తి
బ్రోవలేదె మున్ను ♦ దేవతలను
దేవ! మమ్ము నట్లె ♦ బ్రోవంగ రాదొకో
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 8

ఆ॥ మునుకిటి స్వరూప ♦ మును దాల్చి యాహిర
ణ్యాక్షుఁ దునిమివైచి ♦ యవనిని గుడి
కోఱ దాల్చినట్టి ♦ ధీరుండవీవెకా
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 9

ఆ॥ పరమభక్తుఁ డైన ♦ ప్రహ్లాదు నేలవే
కఠినచిత్తుఁ డైన ♦ కనక కశిపు
నాశనంబొనర్చి ♦ నరహరివై మున్ను
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 10

ఆ॥ వామనుండవగుచు ♦ బలిని మూడడుగులు
భూమి దానమడిగి ♦ పుచ్చుకొనుచు
నాక్రమింపవే య ♦ జాండంబులెల్లను
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 11

ఆ॥ ఇరువదొక్కమార్లు ♦ నరనాథశిరములు
నఱికిమెట్లుగట్టి ♦ నాకమునకు
గురునిబంపలేదె ♦ పరశురాముడవునై
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 12

ఆ॥ జనకజాత నెత్తు ♦ కొనిపోయి లంకలో
డాచినట్టి దశవ ♦ దనునిద్రుంచి
సీతఁ దెచ్చినావు ♦ శ్రీరామమూర్తివై
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 13

ఆ॥ భుజబలంబు మెఱయ ♦ ముసలాయుధహలాయు
ధములదాల్చిరిపుల ♦ దర్పమడఁచి
దిగ్విజయముఁగాంచి ♦ తివిగాదె బలుఁడవై
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 14

ఆ॥ ఆర్యపోషణా! మ ♦ హోజగన్నాథము
నందుబౌద్ధమూర్తి ♦ వై యహింస
యనెడు పరమధర్మ ♦ మును నిల్పితివిధాత్రి
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 15

ఆ॥ కలికిమూర్తివగుచుఁ ♦ గలియుగాంతమ్మునఁ
బాపమతుల నెల్ల ♦ రూపుమాపి
సలిపెదీవు ధర్మ ♦ సంస్థాపనంబును
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 16

ఆ॥ కుందవీంద్రదశయన! ♦ పుండరీకేక్షణా!
మణివిభూష! శౌరి! ♦ మంజుభాష!
పక్షిరాజగమన! ♦ రక్షించుమా, మమ్ము
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 17

ఆ॥ గానలోల! నరస ♦ ఖా! దీనమందార!
భవ్యశీల! సత్కృ ♦ పాలవాల!
కన్నడేలమమ్ముఁ ♦ గరుణించుమీవేళ
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 18

ఆ॥ దిక్కులేని యట్టి ♦ దీనజనులకెల్ల
దిక్కునీవకాఁ ♦ దేవదేవ!
కనుకనిన్ను నమ్మి ♦ కైమోడ్పులర్పింతు
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 19

ఆ॥ శిష్టజనులఁ బెంప ♦ దుష్టులశిక్షింప
ధర్మముమరనిలుప ♦ ధాత్రిలోన
నవసరము నుబట్టి ♦ యవతారమెత్తెదు
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 20

ఆ॥ భవ్యచరిత! యెంత ♦ బ్రతిమాలుకొన్నను
గాని నీదుమనసు ♦ కరుఁగదేమి
కారణంబొ తెల్పఁ ♦ గాఁ బ్రార్థనముఁ జేతు
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 21

ఆ॥ ఆర్తరక్షణా! భ ♦ వాంభోధితరణా! నీ
లీలలను నెరుంగఁ ♦ జాలరెవరు
భక్తితోడ నిన్ను ♦ భజియించుటయె కాని
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 22

ఆ॥ శంఖచక్రధారి ♦ జగతిలో నీసరి
వేల్పులేరి పార్న ♦ వేమురారి!
భక్తహృద్విహారి! ♦ భవహారి! దైత్యారి!
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 23

ఆ॥ అలుకఁ జెందుటేల ♦ నబ్జాక్ష! నాయెడ
నీదునందనుఁడను ♦ నేనుగాన
తనయుతప్పులెల్లఁ ♦ దండ్రిసహింపఁడే
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 24

ఆ॥ మేరుధీర! కావ ♦ వేరా! పరాత్పర!
సకలలోకనాథ! ♦ సదమలాత్మ!
నిగమవేద్య నిన్ను ♦ నెరనమ్మి కొలిచెద
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 25

ఆ॥ దురితములను బాపు ♦ దొరవు నీవనుచు నీ
మరుగు జొచ్చినాఁడ ♦ బరమపురుష!
వెరపుదీర్చి నన్నుఁ దరి ♦ జేర్చు మో తండ్రి!
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 26

ఆ॥ జగతిఁ దిరుపతులకుఁ ♦ జనలేని భక్తుల
కొఱకు నూజివీటి ♦ పురిని వెలసి
వరములొసఁగి నీవు ♦ దరిఁ జేర్చుచుందువు
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 27

ఆ॥ సుజనజీవనా! వ ♦ సుంధర నీకన్న
దైవమెందు లేదు ♦ తలఁచి చూడ
దేవ! నన్ను మించు ♦ దీనుఁ డెందును లేడు
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 28

ఆ॥ వాసవాదివిబుధ ♦ వందిత! కమలాక్ష!
నీలదేహ! సత్కృ ♦ పాలవాల!
భక్తిమీఱ నిన్ను ♦ భజియింతు మమ్మేలు
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 29

ఆ॥ ప్రేమమీఱ నీదు ♦ నామామృతంబునుఁ
దనివిదీరఁ గ్రోలు ♦ మనుజులకును
సర్వకామితములు ♦ సమకూర్చుచుందువు
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 30

ఆ॥ భానుకోటితేజ! ♦ భవనాశ! నీపూజఁ
జేయువాఁడు ముక్తిఁ ♦ జెందుఁగాని
చేయలేని ఖలుఁడు ♦ చెందు నే చెఱుఁగాని
వేంకటేశ! నాజి ♦ వీట్పురీశ! 31

ఆ॥ పరమపురుష! భక్త ♦ వరద! నిరామయ!
నిరుపమాన! పూత ♦ చరిత! సదయ!
తరుణమిదియె నన్ను ♦ గరుణతోదరిఁజేర్చ
వేంకటేశ! నాజి ♦ వీట్పురీశ! 32

ఆ॥ నిన్ను మానసమున ♦ నిలిపి భజింపఁగాఁ
జానలట్టి ఖలుని ♦ జన్మ మేల
గాననిన్ను భక్తి ♦ మానక జపియింతు
వేంకటేశ! నాజి ♦ వీట్పురీశ! 33

ఆ॥ భక్తజన హృదబ్జ ♦ భాస్కర! సర్వేశ!
భవ్యచరిత! నీదు ♦ పాదములను
బూజఁజేతుమమ్ము ♦ బోషింపుమో దేవ!
వేంకటేశ! నాజి ♦ వీట్పురీశ! 34

ఆ॥ నీమహిమ నుతింప ♦ నే నెంతవాఁడను
జిలువఱేనికైనఁ ♦ జేతగాదు
సహజభక్తి వినుతి ♦ సల్పుటయేతప్ప
వేంకటేశ! నాజి ♦ వీట్పురీశ! 35

ఆ॥ మాన్యచరిత! దివ్య ♦ మంగళవిగ్రహ
భవలతాలవిత్ర! ♦ పద్మనేత్ర!
కలుషవన కుఠార! ♦ యలివేలు మంగేశ!
వేంకటేశ! నూజి ♦ వీడ్పురీశ! 36

ఆ॥ తల్లి దండ్రి గురువు ♦ దైవంబువునునీవె
మిత్రబాంధవులును ♦ ధాత్రినీవె
నిన్నుమించువార ♦ లున్నారె శ్రీహరి!
వేంకటేశ! నూజి ♦ వీడ్పురీశ! 37

ఆ॥ సంతులేక నిన్ను ♦ ధ్యానించువారి
సంతునొసఁగివారి ♦ చింతఁదీర్చి
పరమకరుణతోడఁ ♦ బాలించుచుందువు
వేంకటేశ! నూజి ♦ వీడ్పురీశ! 38

ఆ॥ భాసురాంగ! శ్రీని ♦ వాస! ప్రణుతభక్త
పారిజాత! నేను ♦ పామరుఁడను
భయముదీర్చి యెట్లు ♦ పాలింతువోనన్ను
వేంకటేశ! నూజి ♦ వీడ్పురీశ! 39

ఆ॥ అనుపమాన! నీప ♦ దాంబుజద్వయము నే
విడువఁజాల నెపుడు ♦ విమల హృదయ!
తడవుసేయఁబోక ♦ దయఁజూడు మికమమ్ము
వేంకటేశ! నూజి ♦ వీడ్పురీశ! 40

ఆ॥ నిలువు దోపుదోచి ♦ తలనున్నఁగాఁజేసి
చెప్పు బెట్టికొట్టి ♦ తప్పుఁదిద్ది
ప్రజలఁబంపుమనుచు ♦ బంటులనుంచితే
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 41

ఆ॥ ఎవరిబాకిదైన ♦ నెగవైచెదరుగాని
తండ్రి! నీదుబాకి ♦ దమ్మిడీయును
తప్పకుండఁదీర్చె ♦ దక్కవరైనను భక్తి
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 42

ఆ॥ నలిననయన! నీదు ♦ నామసుధారసం
బానిముక్తిఁజెంద ♦ నగునుగాని
కొమ్మచొల్లునీటి ♦ గ్రోలి తరింతురే
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 43

ఆ॥ సిరిప్రకాశ! ధీర! ♦ నిగమాంతసంచార
కనకవసనధారి! ♦ ఖలవిదారి
దర్శనంబొసంగి ♦ దయఁ జూడుమామమ్ము
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 44

ఆ॥ సకల భూతవితతి ♦ సమతనుభావించి
పరధనంబుపైని ♦ భ్రాంతిమాని
భక్తిమీఱనిన్ను ♦ భజియింపఁగావలె
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 45

ఆ॥ కాననమున నొంటి ♦ గానేగునప్పుడు
నిద్రబోవునపుడు! భద్రముగను
గరుణజీవకోట్లఁ ♦ గాపాడెదవునీవు
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 46

ఆ॥ ముడుపుగట్టి నీకు ♦ మ్రొక్కినభక్తాళి
యిడుమలెల్లఁ బాపి ♦ కడుముదమున
రమ్యచరిత! నీవు ♦ రక్షించు చుందువు
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 47

ఆ॥ ఎంత వేడుకున్న ♦ నిసుమంతయునునీకుఁ
గరుణరాదదేమి ♦ కారణంబొ
కఠినమూనఁదగునె ♦ కన్నబిడ్డల యెడ
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 48

ఆ॥ పిన్ననాటినుండి ♦ నిన్నెదలచుచున్నఁ
గన్నతండ్రి! మనసు ♦ కరుగదేమి
యభయ మీయకున్న ♦ నడుగెత్తనీయను
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 49

ఆ॥ పరగ నండ పిండ ♦ బ్రహ్మాండముల యందు
నీవుసందులేక ♦ నిండియుంటి
వనఘ! నీదుమహిమ ♦ గనఁ జాల రెవ్వరు
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 50

ఆ॥ కాంచనోత్తరీయ! ♦ కాపుమా ౹శిత గేయ!
దాసజనవిధేయ! ♦ దైవరాయ!
చూపుమయ్య! కరుణ ♦ నీపాలఁ బడినాఁడ
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 51

ఆ॥ సృష్టిఁజేయునీవు ♦ ౹సష్టవై పోషింపఁ
బుండరీకలోచ ♦ నుండవగుచు
లయమొనర్పఁ ♦ గ యునుండవై తివి
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 52

ఆ॥ చక్రి! దంతిరాజు ♦ నక్రంబుచేఁ జిక్కి
నీవెదిక్కటంచు ♦ నిన్నువేడ
నుకరిఁ బిల్కుమార్చి ♦ మనిచితి వాతని
వేంకటేశ నూజి ♦ వీట్పురీశ! 53

ఆ॥ చేరెడడుకులను గు ♦ చేలుండు నీకీయ
నతనిలేమిఁ బాపి ♦ కుతుకమునను
సకలభాగ్యములు నొ ♦ సంగిరక్షింపవే
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 54

ఆ॥ నీరజాక్షు! యీశ ♦ రీరంబనిత్యంబ
టంచు మానసమున ♦ నెంచఁబోక
స్థిరమటంచునమ్మి ♦ చెడిపోదురజ్ఞులు
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 55

ఆ॥ కాలమెల్ల వృథగ ♦ గడపివార్ధకమున
గొలిచిముక్తినొంద ♦ వలనుపడునె
శక్తిగలిగినపుడె ♦ ధ్యానింపవలెనిన్ను
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 56

ఆ॥ ఆశ్రితావనా! ని ♦ రామయ! బుధలోక
పాలమమ్ముఁ బ్రోవ ♦ వేలనయ్య!
నీదు పాదసేవ ♦ నిరతంబొనర్చెద
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 57

ఆ॥ మానభంగమెదవ ♦ గానున్న ద్రౌపది
యన్న! నిన్నువేడు ♦ కొన్న సభను
నక్షయముగఁజీర ♦ లందించితివిగదా
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 58

ఆ॥ అండమందుఁబిండ ♦ మందును బ్రహ్మాండ
మందు నీవునిండి ♦ యఖిలలోక
తతిని గుక్షిలోనఁ ♦ దాల్చి రక్షింతువు
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 59

ఆ॥ అమల యాదవాన్వ ♦ యంబుననావిర్భ
వించి కృష్ణుఁడనఁగ ♦ వెలసిదుష్ట
పూర్వదేవతతులఁ ♦ బొలియించితివిమున్ను
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 60

ఆ॥ కోపమేల నేను ♦ నీపాలఁబడినాఁడ
దాపుఁజేర్చి ప్రోవ ♦ వేపకేశ!
శ్రీపతీ! కృపాబ్ధి! ♦ తాపసమందార!
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 61

ఆ॥ అప్రమేయ! శౌరి! ♦ యస్ఖలితబ్రహ్మ
చారివగుచు బదియు ♦ నారువేల
గోపికాంగనలను ♦ గూడి మెలఁగితివి
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 62

ఆ॥ జగతిధనికులకును ♦ సంతానమీయక
కూడు లేనివాండ్ర ♦ కుత్తుకకును
వలదటన్నఁ బుట్టి ♦ యలయించుచుందువు
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 63

ఆ॥ నిశ్చలత్వమునను ♦ నీనామమే ప్రొద్దుఁ
బఠనఁ జేయు పరమ ♦ భక్తులకును
గనుఁగొనంగ ముక్తి ♦ కరతలామలకమౌ
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 64

ఆ॥ చిలువపాన్పుదంట! ♦ జీతబత్తెంబులు
లేని నీదుకొలువు ♦ నేనుగొలుచు
చున్నవాడనన్ను ♦ మన్నింపుమింకను
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 65

ఆ॥ భవ్యచరిత! నేను ♦ పనిపాటలను మాని
సేవయుచితముగను ♦ జేయుటకును
నీకు నెన్నఁడైన ♦ నేబాకియుంటినా
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 66

ఆ॥ లోకనాథ! నెట్టి ♦ చాకిరిఁ జేయించు
కొనుట మిమ్ముఁబోటి ♦ ఘనులకెప్పుడుఁ
దగదు నన్ను నీదు ♦ దరిఁజేర్చి రక్షించు
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 67

ఆ॥ నన్నుఁబ్రోవకున్న ♦ నడివీధిలోనిన్ను
నిలువఁబెట్టి నేను ♦ నీదువలనఁ
గూలినిప్పుడే వ ♦ సూలుఁజేసెదఁ జూడు
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 68

ఆ॥ రాజుబంటు బంటు ♦ రాజగుచుండును
గాలమహిమఁ దెలియఁ ♦ గాఁదరంబె
మహిఁ త్రిశంకుసూతి ♦ మాలనుగొలువదే
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 69

ఆ॥ ఘనకృపాలవాల! ♦ సనకసనందాది
మునులు నీపదాబ్జ ♦ ములనుగొలిచి
దురితములను బాసి ♦ తరియించరేమున్ను
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 70

ఆ॥ ఇందిరేశ! భక్త ♦ చందన! సర్వేశ!
యప్రమేయ! శౌరి! ♦ స్వప్రకాశ!
కనికరమునమమ్ము ♦ వనమాలి! ప్రోవవే
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 71

ఆ॥ నిఖిల కష్టములకు ♦ నెలవగు సంసార
సాగరంబునీదఁ ♦ జాలనేను
గన్నతండ్రి! వేగ ♦ నన్నొడ్డుఁ జేర్పుము
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 72

ఆ॥ అద్రిసదృశ! ధీర! ♦ యసమాన! కరుణా స
ముద్ర! నినుభజింతు ♦ మోక్షమిడుము
క్షుద్రదేవతలను ♦ స్తుతియింపనెన్నఁడు
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 73

ఆ॥ పక్షిరాజగమన ♦ పరికింపనీపేరు
నేతిబీరకాయ ♦ రీతియగును
నన్ను గరుణఁజూడ ♦ కున్నచోనిత్తఱి
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 74

ఆ॥ పండితులనుజూచి ♦ పరిహసింపఁగరాదు
సాధుజనులకెగ్గు ♦ సలుపరాదు
బీదవారి నెపుడుఁ ♦ బీడింపగారాదు
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 75

ఆ॥ తనదు తప్పుఁదాను ♦ మనమునం దెంచక
పరులతప్పులెన్న ♦ నరయువాడు
కారుదున్నపోతు ♦ గాకమనుష్యుఁడే
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 76

ఆ॥ పరులకెన్ని ధర్మ ♦ పన్నాగములనైనఁ
జెప్పవచ్చుఁదాను ♦ సేయలేమ
నుడివినట్లు నడువఁ ♦ గడుఁగష్టమగుఁగాదె
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 77

ఆ॥ ధనమదాంధులగుచు ♦ మనమున నినుసదా
నిలిపికొలువలేని ♦ కలుషమతుల
చెలిమిఁ జేయునట్టి ♦ చెనటుల బ్రతుకేల
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 78

ఆ॥ పాపభీతివీడి ♦ పరకాంతలనుగూడి
యదియె స్వర్గభోగ ♦ మనుచుఁదలచి
నిన్నుమఱచునట్టి ♦ నీచులగతియేమి
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 79

ఆ॥ తననుదాను బొగడు ♦ కొనుచును నిరతంబుఁ
బరులనిందసేయు ♦ వెరపులేని
క్రూరమతులకెట్లు ♦ కుదురు నీపదభక్తి
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 80

ఆ॥ తనకు లేదటంచు ♦ మనమునఁ గుందుచు
నొరులకలిమిఁగాంచి ♦ యోర్వ కేడ్చు
తుచ్ఛనరులకెట్లు ♦ దొరకును మోక్షంబు
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 81

ఆ॥ తల్లిదండ్రులైనఁ ♦ జెల్లినమనవచ్చు
పరపతింత చెడిన ♦ బ్రతుక లేరు
కంతుజనక! ధాత్రి ♦ నెంతేసి వారును
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 82

ఆ॥ కాకిముక్కునకును ♦ గట్టినరత్నంబు
పగిదిఁగాదె యొక్క ♦ సొగసుఁగత్తె
మోటుమూనిసికిని ♦ ముడివెట్టుటరయగా
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 83

ఆ॥ ఐనవారికాకు ♦ లందున వడ్డించి
కానివారలకును ♦ గంచములను
బెట్టుచుందు రెపుడుఁ ♦ బ్రియము మొప్పఁ జెనటులు
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 84

ఆ॥ క్షితిని గొంతమంది ♦ మతభేదమునదము
మతము మంచిదితర ♦ మతము చెడ్డ
దనుచునిందసేతు ♦ రజ్ఞానవశమున
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 85

ఆ॥ మనసునిలుపలేని ♦ మానవాధములకు
ముక్కుమూసినీట ♦ మునిగిజపత
పంబులాచరింప ♦ ఫలమింతగలుగునే
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 86

ఆ॥ భర్తయాజ్ఞ శిరము ♦ పైనిడుకొని సదా
నడచుకొనెడు సతికి ♦ బుడమివేరు
వ్రతములాచరింప ♦ వలయునె పరికింప
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 87

ఆ॥ కలిమిగలుగువారు ♦ కానివారును నాప్త
బంధువర్గమగుచుఁ ♦ బరగుచుంద్రు
లేనివారు ముఖ్య ♦ లేనియుఁ బరులౌను
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 88

ఆ॥ తెలుకొండెకొనకుఁ ♦ దేనెరాచిన విస
మెటులపోదో యటులె ♦ కుటిలునకును
నీతిఁగఱపుటెల్ల ♦ నిష్ప్రయోజనమౌను
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 89

ఆ॥ సారహీనమైన ♦ సంసారమున మర్త్యుఁ
డంటి యంటకుండ ♦ ననవరతముఁ
గుమ్మరంగవలయుఁ ♦ గుమ్మరపురువట్లు
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 90

ఆ॥ కల్లుద్రావ వెండి ♦ కప్పెఁజెడుకూళ్ళు
గుడువబోవునపుడు ♦ మడియ దేల
బోడితలకు మల్లె ♦ పూదండ యేటికి
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 91

ఆ॥ నాలిబూతమునకు ♦ మేలుఁగావించుట
పాలుఁబోసి చిలువ ♦ నేలినట్లు
గాక తనకు మేలు ♦ గలుగ దెన్నటికిని
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 92

ఆ॥ అత్తవారిసొమ్ము ♦ నపరిమితంబుగాఁ
దినుచు నుంతయైనఁ ♦ దృప్తిఁగనక
గొణుగుచుండు నెప్పుడు ♦ కూళయగా నల్లుండు
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 93

ఆ॥ ధనికుఁడెట్టిచెడ్డ ♦ పనినాచరించిన
వానిఁదప్పటంచుఁ ♦ బలుకఁడొకఁడు
ధన విహీనుమంచి ♦ పనినైనఁ దప్పంద్రు
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 94

ఆ॥ సుగుణరాశియైన ♦ మగువతో సంసార
మదియె స్వర్గభోగ ♦ మగును జగతి
రాగతోడఁ గాపు ♦ రంబే నరకమౌను
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 95

ఆ॥ రాక్షసులు ననంగ ♦ నీక్షితిలోఁ గ్రూర
కర్మములనొనర్చు ♦ కలుషమతులు
గాక వేరుగా నొ ♦ కరు లేరుపరికింప
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 96

ఆ॥ సత్యశీలురగుచు ♦ సతతంబును బరోప
కారులగుచుఁ బుణ్య ♦ కర్మములను
జేయునట్టివారు ♦ జేజేలతోసముల్
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 97

ఆ॥ లలితచరిత! జ్ఞాను ♦ లమటంచు గంజాయి
దమ్ముఁగొనుచు శిష్య ♦ తతులవలనఁ
జూరగొంద్రు ధనము ♦ శుష్కవేదాంతులు
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 98

ఆ। కష్టకాలమందు ♦ గనరానివిందేలఁ
గూడుగుడ్డలిడని ♦ కొమరుడేల
దానగుణములేని ♦ ధనవంతుడేటికి
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 99

ఆ॥ వాసవాదివిబుధ ♦ వందిత! ధనకాంత
తనయుఁడెంత చదువు ♦ కొనినఁగాని
తండ్రిపేరుఁజెప్పఁ ♦ దడబడుచుండును
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 100

ఆ॥ అన్నదమ్ములకును ♦ నాప్త బంధువులకుఁ
దల్లిదండ్రులకును ♦ బిల్లలకునుఁ
బైకమెవరికైనఁ ♦ బగఁ దెచ్చుచుండును
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 101

ఆ॥ అత్తబెట్టుచుండు ♦ నారళ్ళకనరావు
కోడలాచరించు ♦ కొంటెపనులు
కానుపించునాపె ♦ కర్మంబదేమొకో
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 102

ఆ॥ అవసరమున కీయ ♦ డని తెలిసినవాని
కప్పునీయఁగూడ ♦ దనఘ! తమకు
నప్పొసంగువానిఁ ♦ ద్రిప్పించుకొనరాదు
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 103

ఆ॥ విత్తవంతుఁడనని ♦ విఱ్ఱవీగఁగరాదు
ధనవిహీనుఁగ సరు ♦ కొనఁగరాదు
కలిమిలేములెన్నఁ ♦ గా నస్థిరంబులు
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 104

ఆ॥ జవ్వనంబుఁగాంచఁ ♦ జంచలలతవంటి
దట్టిదాని దిరము ♦ టంచునమ్మి
మూఢమతులు పాప ♦ ముల నాచరింతురు
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 105

ఆ॥ ప్రియముఁగలుగువిందు ♦ పీయూషసమమహా మ
ననుభవించువానిఁ ♦ దనియఁజేయుఁ
బ్రియములేనివిందు ♦ విషతుల్యమైతోఁచు
వేంకటేశ నూజి ♦ వీట్పురీశ! 106

ఆ॥ సరసునకు నొసంగఁ ♦ జనునెన్నటికిఁగృతి
నిందువేడ్కను సర ♦ సుండుగాని
వానికిడిన గౌర ♦ వమునకు భంగమా
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 107

ఆ॥ తమ్మికంటి! యీశ ♦ తకముద్రణమునకు
ధనమొసంగినట్టి ♦ ధార్మికుండు
పరమభక్తుఁడైన ♦ సిరికొండ మంగయ్య
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 108

ఆ॥ ధరణి సుగుణియైన ♦ సిరికొండ మంగయ్య
భక్తవరున కఖిల ♦ భాగ్యము లిడి
నిరత మేలుమయ్య! ♦ పరమేశ! భవనాశ!
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 109

ఆ॥ మంగళంబునీకు ♦ మాన్యచరిత! జయ
మంగళంబు నీక ♦ నంగ జనక!
మంగళంబుఁగొనుము ♦ మంగళవిగ్రహా!
వేంకటేశ! నూజి ♦ వీట్పురీశ! 110

---